పృథ్వీవృత్తము.—

ప్రియంబగుచు రుద్రవిశ్రమము పృథ్వికాసంజ్ఞికా
హ్వాయం బగు జసంబుతో జసయవంబులున్ గూడినన్.

వ. ధృతిచ్ఛందంబునకుఁ బదునెనిమిది యక్షరంబులు పాదం
బుగా ౨౬౨౧౪౪ వృత్తంబులు పుట్టె. అందు,

కుసుమితలతా వేల్లితవృత్తము.—

అశ్రాంతత్యాగాన్విత! మతనయాయంబులన్ రుద్రసంఖ్యా
విశ్రాంతంబై నన్ గుసుమితలతావేల్లితావృత్తమయ్యెన్.

మత్తకోకిలవృత్తము.—

శ్రావకాభరణాంక! విన్ రసజాభరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల యండ్రు దీనిఁ గవీశ్వరుల్. 92

[2]అతివినయవృత్తము.—

ననలుగలయఁగ ననలనసయుతము లగుచున్
దనరు నతివినయ కివి దశమయతి కృతులన్. 93

[3]త్వరిత పదగతి వృత్తము.—

సరసిరుహభవ సదృశ చతుర! ననన నాయల్
త్వరిత పదగతి కమరు దశమయతియుఁ గాఁగన్. 94

వ. అతిధృతిచ్ఛందంబునకుఁ బందొమ్మిదియక్షరంబులు పాదం
బుగా ౫౨౪౨౮౮ వృత్తంబులు పుట్టె. అందు,

శార్దూల విక్రీడిత వృత్తము—

సారాచార విశారదా! యినయతిన్ శార్దూలవిక్రీడితా
కారంబై మస జమ్ములిమ్ముగ సతాగప్రాప్తమై చెల్వగున్.

---

1-క-బ-లలోనున్నది. 2 క-లో మాత్రమున్నది. 3 క-బ-లలో
మాత్ర మున్నది.

మేఘవిస్ఫూర్జితవృత్తము.— [ఖ్యం

మృగేంద్రోద్యచ్ఛౌర్యా!యమనసములన్ మేఘవిస్ఫూర్జితా
బగున్నీదన్ రాగంబొడఁబడిన సూర్యాంకవిశ్రాంతమైనన్.

తరల వృత్తము—

ప్రవర రుద్ర విరామ యుక్తి నభంబులు న్ రసజాగముల్
గవిజనాశ్రయ!పొంది యందము గామహిన్ దరలంబగున్.

చంద్రకళావృత్తము. —

శ్రావకాభరణాంక! దిశావిశ్రామముతోడ రసాతముల్
జావిలగ్నగకారయుతంబై చంద్రకళాహ్వయమై చనున్.

భూతిలకవృత్తము.—

భారసజాగగణంబులన్ గుచభారనమ్రవధూముఖాం
భోరుహభాస్కర! రుద్రయుగ్యతిఁ బూనిభూతిలకంబగున్.

[1]శుభికావృత్తము. —

సూరిస్తుత్యా!మభనసవిలసితసూర్యయతిన్ శుభికా
కారంబై యెల్లకృతులనెఱయును గల్పితభాగలచేన్. 100

వ. కృతిచ్ఛందంబున కిరువదియక్షరంబులు పాదంబుగా
౧౦౪౮౫౭౬ వృత్తంబులు పుట్టె. అందు,

మత్తేభవిక్రీడితవృత్తము. —

స్మయదూరా! విలసత్త్రయోదశయతిన్ మత్తేభ విక్రీడితా
హ్వయ మయ్యెన్ సభరంబులున్ నమయవవ్రాతంబులున్
గూడినన్.

---

1 బ-లో మాత్ర మున్నది.

ఉత్పలామాలావృత్తము.—

భానుసమాన!విన్భరన భారలగంబులఁగూడి విశ్రమ

స్థానమునందుఁ బద్మజయుతంబుగ నుత్పలమాలమైచనున్.

అంబురుహావృత్తము.—

శ్రీరమణీప్రియ! మల్లియరేచ! విశిష్టకల్పమహీజ! భా

భారసవంబుల నంబురుహం బగు భానువిశ్రమయుక్తమై.

[1]ఖచరప్లుతవృత్తము.—

అమితసాహస! రుద్రవిరామాయత్తము లైన నభామసా

సములగున్ ఖచరప్లుతనామవ్యక్తి నియుక్తసమేతమై. 104

[2]ప్రభాకలితవృత్తము.—

వెలయునజాభరసంబులున్ రవివిశ్రమంబులునుం బ్రభా

కలితకు నొప్పునగణ్యపుణ్యా! లగంబు మీఁద ధరన్ గృతిన్.

వ. ప్రకృతిచ్ఛందస్సున కిరువదియొక్క యక్షరంబులు పాదం

బుగా ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె. అందు.

స్రగ్ధరావృత్తము.—

శ్రీమన్మూర్తీ!మకారాశ్రితరభనయయాసేవ్యమైసానుమద్వి

శ్రామంబై సానుమద్విశ్రమమున మరఁగా స్రగ్ధరావృత్తమయ్యెన్.

చంపకమాలావృత్తము.—

నజభజజల్ జరేఫలు పెనంగి దిశాయతితోడఁ గూడినన్

[3]ద్రిజగదభిస్తుతా!బుధనిధీ!విను చంపకమాలమై చనున్.107

---

1 ద-ఖచప్లుతము. 2 క-ద-లలో నున్నది. బ-లో దీనికే భంగ్యంత రముగా లఘుప్రభాకలితవృత్తము గలదు. అహర నజాభరసంబులున్ లగ మంబు సూర్యవిరామమున్ గొమరుగఁ జెందు నవేందు మౌళి లఘుప్రభాకలి తాఖ్యకున్. 3 ద, ద్రిజగదభష్టదా.

[1]లాటీవిటవృత్తము.—

ససామతయంబులు సూర్యయతిశ్రయ్యంబై లాటీవిటవృత్తం
బసమానయశా!నుతమానగుణా!యాశ్చర్యాన్వితంబగు ధాత్రిన్

వనమంజరీవృత్తము.—

నయుతజకారచతుష్కభరేఫగణత్రయమో దశవిశ్రమా
శ్రయమగు నవ్వనమంజరి రేచన! సర్వశాస్త్ర విశారదా!

మణిమాలావృత్తము.—

కదియంగమూఁడుసజముల్ సకారయుతమైదిశాఖ్యయతిగా
మదనానుకారి!నిఖిలాగమజ్ఞ! మణిమాలయండ్రుసుకవుల్.

[2]కరిబృంహితవృత్తము.—

మూఁడుభనములుగూడి రగణముమున్టికొనఁగరిబృంహితం
బాడు వనమునిజార్ధమునఁగల యద్రిశయతిని నర్కులన్.

వ. [3]ఆకృతిచ్ఛందంబున కిరువదిరెండక్షరంబులు పాదంబుగా
ఠర్గరఠ3౦ఠ వృత్తంబులు పుట్టె. అందు.

మహాస్రగ్ధరావృత్తము.—

లసదుద్యత్కీర్తివల్లీ లతితగుణగణాలంకృతాంగా! సతాన
స్థసరాగంబుల్ మహాస్రగ్ధరకువసుమునిస్థానవిశ్రాంతినొప్పున్.

[4]సుభద్రకవృత్తము.—

మందరభృత్సమాన! నిఖిలాగమజ్ఞ! వెలయంగరుద్రయతితో
నందముగాభసంయుతరనత్రయాగ్రగురువై సుభద్రకమగున్.

---

1. ద లాటవిట. 2 బ-లోమాత్రమున్నది. 3. క అతికృతి 4. చ-డ-బ-లలో దీనికిఁజంద్రకమను పేరున్నది.

మానినీవృత్తము.—

కారకముల్ క్రియ గన్గొన నేడుభ
　　కారము లొక్క గకారముతో
గారవమై చనఁగా యతి పంద్రెటఁ
　　గల్గిన మానినికామనిభా! 114

[1] తురగవృత్తము.—

ననన సజములను జగము దుద నాటుకొల్పిన రేచనా!
చనుఁ దురగ మన జగతి నిది మనుసంప్రయుక్తవిరామమై.

వ. వికృతిచ్ఛందంబున కిరువదిమూఁడక్షరంబులు పాదంబుగా
　　౮౩88౫౬౦౮ వృత్తంబులు పుట్టె. అందు,

అశ్వలలితవృత్తము.—

నజగణముల్ భజద్వయముతోఁ బెనంగి
　　భవయుక్తమై ధరణిసూ
ర్యజ మగువిశ్రమం బమరియున్న నశ్వ
　　లలిత మ్మగున్ గుణనిధీ! 116

కవిరాజవిరాజితవృత్తము.—

క్రమమున నొక్కనకారము నాఱుజ
　　కారములుం బరఁగంగవకా
రమును నొడంబడి రాఁ గవిరాజవి
　　రాజిత మన్నది కామనిభా! 117

---

1. బ-లో మాత్ర మున్నది.

వ. [1] సంకృతిచ్ఛందంబున కిరువదినాలుగక్షరంబులు పాదంబు
గా ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె. అందు,

సరసిజవృత్తము.—

మారాకారా! చారుచరిత్రా!
మతయననసస [2]మహియతిరచనఁ
సారంబైనఁ సూరికవీంద్రుల్
సరసిజ మని వినఁ జదివిరి సభలన్.[3] 118

క్రౌంచపదవృత్తము.—

పంచశరాభా! సంచితపుణ్యా!
భమసభననయపరిమితమైనఁ, [4]
క్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెఁ
గ్రమయతి దశవసుకలితము గాఁగఁ.[5] 119

వ. [6] అభికృతిచ్ఛందంబున కిరువదియైదక్షరంబులు పాదంబు
గా ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టె. అందు,

బంధురవృత్తము.—

అమరఁగ ననననసభభభగయుతం
బై తిథి విశ్రమమొంది చనఁ
బ్రముదితకువలయ! పరహితచరితా!
బంధుర మన్నది వృత్త మగున్. 120

---

1 చ-సత్కృతి, ప-సుకృతి. 2 క-డ మహితపురచనఁ. 3 చ-డ-ద మొదలన్. 4 క-ప పరివృతమైన్. 5 ప - రసదశకలితముగాఁగన్. 6 క-లో నీఛందస్సు లేదు.

భాస్కరవిలసితవృత్తము.—

భాస్కరసదృశ సముజ్జ్వల తేజా!
భాసుర భనజయభసనసగంబుల్
భాస్కరవిరమణబంధుర మైనన్
భాస్కరవిలసిత మనిరి కవీంద్రుల్. 121

[1] జలదరవవృత్తము.—

నన నన ననలు ననల నొడఁబడి
నయవినయనిధి! వినుము రే
చన! మనుయతిని నిలుపఁగ మహిని
జలదరవ మగు గురువుతోన్. 122

వ. [2]ఉత్కృతిచ్ఛందంబున కిరువదాఱక్షరంబులు పాదంబుగా ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు పుట్టె. అందు,

భుజంగవిజృంభితవృత్తము.—

[3]ధీరాసారతోద్యోదారత్వస్థిరగుణ! నసు
దశమయతిన్ భుజంగవిజృంభితా
కారం బారంగాఁ దోఁచున్ సంగతమమతన
ననరసకారమై నయుతంబుగాన్. 123

---

1 బ- లో మాత్రమున్నది. 2 ద- ఉత్కృతిచ్ఛందంబున ... 3 ... తోద్యోదారత్వాదృత.

మంగళమహాశ్రీవృత్తము.—

శ్రీమహిత! లోకహిత! శిష్టజనసేవిత!
విశేషగుణ! మంగళమహాశ్రీ
[1] నామ మగు నబ్భజసనంబులకడన్
భజసనంబులు గగంబులు పెనంగన్. 124

[2] క. కమనీయంబగు నీక్రియ
సమవృత్తము లిరువదాఱుఛందంబుల నీ
క్రమమున మల్లియరేచన
రమణీరమణీయరమణరమణుఁడు చెప్పెన్. 125

---

ఉద్ధరమాలావృత్తములు.

క. పరఁగఁగ నిరుపదియాఱ
క్షరముల కగ్గలము చెప్పఁగాఁ బాదము లు
ద్ధరమాలావృత్తములై
పరఁగు లయగ్రాహి లయవిభాతి యనంగన్. 126

---

1 ద-నామమునకున్ భజసనంబులు పెనంగు నసునాను యతి రెట్టిగఁ గుదిరెఁగాన్. 2 ఈపద్యము పిఠపఁ జాల ప్రతులలో నీక్రిందిపద్య మున్నది. చ. ఒగిఁబదుమూఁడు కోటులును నొప్పగ నల్వదిరెండు లక్షలున్, దగఁ బదియేడువేలు విదితంబుగఁదానట నేడునూటిపై, నగణితవైభవా! యిరువదాఱగు సంఖ్యఁ జెలంగి యొప్పెడున్, సగుణిత యిర్వదాఱు నగు ఛందములన్ సమపాదవృత్తముల్. డ-లో 3, 4 పాదములు. అగణిత వైభవా!యిరువదాఱగు సన్నుతపాద వృత్తముల్,జగమున నెన్నిచూడఁగ విశాలయశోనిధి రేచధీమణీ!

లయగ్రాహివృత్తము.—

[1]ఇం బడరఁగా భజసనంబులకడన్ భజస
సంబులు భకారము నొడంబడి లయగ్రా
హిం బరఁగఁ జెప్పఁ గలశం బిడినయట్ల యగ
ణంబు కృతిమీఁద నమరుం బరహితార్థీ !. 127

లయవిభాతివృత్తము.—

ననననసనంబులును నననసగంబులును
నెసఁగఁగృతి పాదముల రసికతను జెప్పన్,
గుసుమశరవత్సుభగ ! యసదృశగుణా! వినుత
రస! లయవిభాతి యని రసమసుకవీంద్రుల్. 128

త్రిభంగివృత్తము.—

నననసలును సనభమలును సగయుక్తము లైనన్
మృదు వైనన్ బ్రస్తుత మైనన్
వనరుహభవనిభ ! మన మలరఁ ద్రిభంగిని జెప్పన్
వడి దప్పన్ బ్రాసము లొప్పన్ . 129

[2]లయహారివృత్తము.—

పదునొకఁడునగణములతుద సగణమును గురువుఁ
గదిసి మృదుపదరచన నొదవి క్రియఁ బ్రాసా[3]
స్పదనిరతి నునుపఁదగు నది సుకవివరులు పొగడుదు
రసమబహుకృతుల విదితలయహారిన్. 130

---

1 డ-లోకేను. 2 డ-లయవిహారి. 3 ద-వాచా.

[1]దండకలక్షణము.—

అమరఁగనన హంబులం[2] దాది గానొండె, కాదేని నాదిన్ దకారంబుగా నొండె,లోనన్ దకారంబు లిమ్మైగ కారావసానంబుగాఁ జెప్పినన్,దండకం బంద్రు దీసింగపీంద్రుల్ జగద్గీతకీర్తీ!పురారాతిమూర్తీ! సదాచారవర్తీ!సముద్యద్గుణార్థీ! వణిగ్వంశచూడామణీ! బంధుచింతామణీ! శిష్టరక్షామణీ! సుందరీవశ్యవిద్యామణీ! రేచనా! కావ్యసంసూచనా[3]! 131

---

—=॥ అర్ధసమవృత్తములు. ॥=—

[4]క. కమలాధీశుఁడు రేచన
కమలాసనకమలనాభకమలాప్రియవృ
త్తముల మహత్త్వము తేజ
స్సమేతుఁ డొనరించు నర్ధసమవృత్తములన్. 132

[5]క. ఆదిద్వితీయవిలస
త్పాదంబులు వేఱువేఱుభంగుల నిడి య
ప్పాదములఁ బోలఁ దక్కిన
పాదము లర్ధ సమవృత్తపద్ధతి నొప్పున్. 133

---

1 ప-లో లేదు. 2 ప-అమరంగసనహంబులన్. 3 డ-త్యాగవైరోచనా. క. చ. లలో దండకాంతమునఁ బ్రకరణాంత గద్య మున్నది. డ-లో "ఇదిస్వస్థానపరస్థానవృత్తాధికారము" అని యున్నది. 4 క-ద-లలో మాత్ర మున్నది. 5 క-ప-ద-లలో నున్నది.

వ. అర్ధసమవృత్తంబు లన్నవి స్వస్థానార్ధసమవృత్తములు, పరస్థానార్ధసమవృత్తములు నా రెండుదెఱంగు లయ్యె. స్వస్థానార్ధసమవృత్తము లన్నవి యుక్తాదిషడ్వింశతిచ్ఛందంబులలో నొక్కఛందంబున మొదలిపాదంబును [1]రెండవపాదంబును మూఁడవపాదంబును నొక్క వృత్తముగా వ్యత్యాసముచేసి చెప్పునవి. మఱి పరస్థానార్ధ సమవృత్తము లన్నవి మొదలిపాదంబును మూఁడవపాదంబును నొక్కఛందంబున రెండవపాదంబును నాల్గవపాదంబును నొక్కఛందంబునఁ జెప్పునవి. స్వస్థానార్ధవృత్తములలో.—

నారీప్లుతవృత్తము.—

[2]వారశ్రీసంసేవ్యవక్షా! మతాగా
కారంబు నిత్తాజగగస్వరూపం
బారంగం బూర్వా పరార్ధంబు లైనన్
నారీప్లుతం బన్నది నామ మయ్యెన్. 134

---

1 ద-నాఛందంబున నొక్కవృత్తంబున రెండవపాదంబును మూఁడవపాదంబును నాల్గవపాదంబును నిట్లు వ్యత్యాసముగాఁ జేసి చెప్పునది. మూలము స్పష్టముగా లేదు. వృత్త మంతయు నొక ఛందమునకే చేరియుండి బేసిపాదము లొకవృత్తమునకును సరిపాదములు వేఱొకవృత్తమునకును సంబంధించి యున్నచో నది స్వస్థానార్ధసమవృత్త మగు నని భావము. 2 క. ప. ద. లలో నున్నది. ఈవృత్తము త్రిష్టుప్ఛందములోనిది. బేసిపాదములు శాలినీవృత్తలక్షణమునకును సరిపాదము లింద్రవజ్రవృత్తలక్షణమునకును సరిపడును.

రతిప్రియవృత్తము.—

[1]ఖ్యాతంబై మనజరగ వ్రజంబులో సం
గతంబుగా జభసజగంబు లూర్జిత
శ్రీతస్వీప్రముదితచిత్త! చిత్తజాభా!
రతిప్రియం బనిరి తిరంబుగాఁ గవుల్. 135

[2]అజితప్రతాపవృత్తము.—

సజసాగణాళివికసన్నవనీ
రజముఖా! నభజరవ్రజంబులో
నజితప్రతాప కుభయార్థములై
నిజముగాఁ దగు ననుందిరంబు గాఁగ. 136

[3]కోమలీవృత్తము.

జననుతకీర్తి! నజాయగణంబుల్
ఘనంబుగా జభసర కారంబులో

1 క-ద-లలో మాత్రమున్నది. ఈవృత్తి మతిజగతీఛందస్సులోనిది. బేసిపాదములు ప్రహర్షిణీలక్షణమునకును సరిపాదములు రుచిరవృత్తలక్షణమునకును సరిపడుచున్నవి. 2 క-ద-లలో మాత్రమున్నది. ఇది జగతీఛందములోనిది. బేసిపాదములు ప్రమితాక్షరావృత్తలక్షణమునకును సరిపాదములు ప్రియంవదావృత్తలక్షణమునకును సరిపడుచున్నవి. 3 ఇదియు జగతీఛందస్సులోనిదే. పొరపాటున వ్రాఁతప్రతులలోఁ బరస్థానార్ధసమవృత్తములలో నుదాహరింపఁబడియుండును. విషమపాదములు తోదకవృత్తమునకు జేరినవి.

ననుపములై యుభయార్థములందుఁ
బెనంగఁ గోమలియను పే రొప్పగున్. 137

మనోహరవృత్తము.—

[1]చారిత్రనిదాన! తజావము లు
ద్ధురమయ్యె సకారచతుష్కముతో
నారంగఁ బడ న్నుభయార్థములన్
విరచింప మనోహరవృత్త మగున్. 138

మణివితానకాంతివృత్తము.—

[2]సంబుద్ధీ! మసజంబుతో గకా
[3]రంబుతో రనమురంబునన్ వకా
రంబొందన్ గవిరాజితోభయా
ర్థంబగున్ మణివితానకాంతికిన్. 139

---

1 బేసి పాదములు త్రిష్టుప్ ఛందస్సులోని కాంతావృత్త లక్షణమునకును, సరిపాదములు జగతీ ఛందస్సులోని తోటకవృత్తలక్షణమునకును సరిపడుచున్నవి.

2 విషమపాదములు పంక్తిచ్ఛందస్సులోని శుద్ధవిరాటివృత్తమునకును, సమపాదములు త్రిష్టుప్ఛందస్సులోని రథోద్ధతవృత్తమునకును జేరుచున్నవి. ఇది. క. ద. లలోనున్నది.

3 రంబుతో రసరంబంపుపైవకా, అని పాఠాంతరము.

క. ఇప్పాటఁ దొల్లి పింగళు
చెప్పినక్రియఁ దప్పకుండఁ జెలు వలరంగాఁ
జెప్పఁబడె వళ్లుప్రాసలు
తప్పకయర్ధసమవృత్తతతి విదితముగాఁ. 140

గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహమధుకరాయమానశ్రావకాభరణాంకవిరచితం బైనకవిజనాశ్రయం బనుఛందంబునందు వృత్తాధికారము.



1 ఇది క-ద-లలో మాత్ర మున్నది.

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము.

## జా త్య ధి కా ర ము.



క. [1]శ్రీకమనీయుఁడు వాణీ
శ్రీకమనీయుండు ధాత్రి రేచన కీర్తి
శ్రీకమనీయుఁడు సకలక
ళాకుశలుఁడు చెప్పు జాతిలక్షణ మొనరన్. 1

క. జాతులు మాత్రాసమక
[2]ఖ్యాతగణప్రతతిఁ జెప్పఁ గందము లయ్యేన్.
గీతులు మొద లగునవి యుప
జాతులు భూతలవినూత్న జాతయశస్కా! 2

---

1. క-డ-ల-లో, శ్రీకాంతాసఖుఁడా శాం, తాకాంతనితాంతకాంతుఁ డగురేచన వా, క్ఛీ)కమనీయుఁడు (శేషము సమానము). ద-లో, శ్రీకాంతాసఖుఁడును గాం, తాకాంతనితాంతకాంతుఁ డగుచు సదావా, క్ఛీ)కమనీయుఁడు (శేషము సమానము) 2. క-ప-డ-లలో, ఖ్యాతగణప్రతతిఁ జెప్పఁగందము లార్యాగీతులు మొదలుగఁ గలయవి (శేషము సమానము).

## కందము.

క. ఆది గురు విడిన గురువే
పాదాదుల నెల్ల నిలుపఁబడుఁ గందములం
దాది లఘు విడినలఘువే
పాదాదుల [1]నిలుపవలయుఁ బరహితచరితా!. 3

క. [2]వెలయఁగ గాభజసనలం
బులు నేనును గాని కందమున కొండు గణం
బులు చొరవు, వానిపాదం
బుల నిడు నది మూఁడు నేను మూఁడు న్నేనున్. 4

క. [3]హిమకర పుర శర నగముల
నమరుపఁగాఁ జనదు జగణ మందలి రెండ
ర్థములన్ నల మొండె జకా
రమొండె నాఱవయెడం దిరము గావలయున్.[4] 5

---

1 ద-నిడఁగ. 2 ప-ద-లలో లేదు. ಗಿರಿಶಂಧೂರ್ಜಟಿ ಶರ್ವಾ, ಪುರಾರಿ ಮಖರಿಪು ವೆನಿಪ್ಪವಿಂತೆಸ್ಥುಗಣಂ,ಬರೆ ಶಶಿಪುರವಿಷಯಾದ್ರಿಯೊ, ಶಿರದಿರ್ಕೆ ಪುರಾರಿ ಯೆಂಬಗಣಮುಜ್ಜಮುಖಿ. (ಕರ್ಣಾಟಕಚ್ಛಂದೋಂಬುಧಿ) 3 ಶಶಿಪುರಬಾಣಾದ್ರಿಗಳೊಳ್, ಬಿಸಜಮುಖಿ! ಮಧ್ಯಗುರುಗಳಾಗಲ್ ಕಂದಂ, ಪುಸಿಯತ್ತೆ? ಗಂಡನಲ್ಲದ, ಶಶಿವದನೆಗೆ ಗರ್ಭ ಮಾದ ತೆಱನೊಳ್ ಕೆಡುಗುಂ, (ಕ-ಛಂ.) 4 ఈ పద్యము తరువాత ప, ద-లలో ద్వాదశమాత్రలు మొదలిడఁ, బాదం బగు నాద్వితీయపాదంబునకున్, ద్వాదశమాత్రలు చన యతి, కాఁ దగు వసుమాత్ర లర్ధకందము రేచా! అను పద్యమున్నది.

క. [1]కందము త్రిశరగణంబుల
[2]నందును, గాభజసనలము లైదునె గణముల్;
పొందును నాఱిట నలజము,
లొందుం దుదిగురువు, జగణ మొప్పదు [3]బేసిన్. 6

క. [4]నెల వెఱిఁగి నిడుదపాదం
బుల నాలవగణము మొదలఁ బొదలఁగ నిడఁ గా
వలయును వ ల్లాపాదం
బులతుద గురు వమరఁ గందమున కిడవలయున్. 7

—— ఆర్య. ——

క. [5]క్రమమునఁ గందము రెండ
ర్ధములతుదన్ గురువు లుంచి, తప్పక కడయ
ర్ధము నాఱవయెడ లఘు విడ
నమితగుణైశ్వర్యధుర్య! యది యార్య యగున్. 8

---

1 కందము త్రిశరగణంబుల, నందము గాభజసనము లట వడి మూఁటన్, బొందును నలజల నాఱిట, నొందుం దుదగురువు జగణముండదు బేసిన్ (సులక్షణసారము). 2 ప. నందము గా భజసనలములటముని యతినై, ద. నందము గగభజసనలము లైదే గణముల్. 3 ద. ముండదు. 4 ప. లో లేదు. 5 లక్ష్మైతత్సప్తగణా గోపేతా భవతి నేహ విషమే జః। షష్ఠోయం చ నలఘువా ప్రథమేర్ధే నియత మార్యాయాః. షష్ఠేద్వితీయలాత్పరకే న్లేము ఖలాచ్చసయతి పదనియమః। చరమేఽర్ధేపంచమకే తస్మాదిహ భవతి ష ష్ఠోలః. (వృత్తరత్నాకరము). మిగదేల్ గణముంబ కాన్,ర్యగెముంతం తు డయె లొంచె గురుతాంబండి, న్నగలచె పదార్థదోళ్ శిశు, మృగాక్షి!, లఘు

## గీతి, ఉపగీతి, ఉద్గీతి.

క. [1]అమరఁగ నార్యాపూర్వా
ర్ధమునన చెప్పునది గీతి, తత్క్రియనపరా
ర్ధమున నుపగీతి, తద్వ్య[2]
త్క్రమమున నుద్గీతి యగు జతద్గీతయశా !. 9

---

ವೊಂದೆಬಂದು ನಿಲ್ಕುಂರಸವೊಳ್. ಮೊದಲೊಳ್ ಪನ್ನೆರಡೆರಡನೆ, ಯದಱೊಳ್ ಪದಿನೆಂಟು ಮೂಱಱೊಳ್ ಪನ್ನೆರಡಂ,ತ್ಯಪಾದದಲ್ಲಿ ಪದಿನೈದುವಮಾತ್ರಾನಿಯಮಮಾರ್ಯೆ ಯೊಳ್ ವನಜಮುಖೀ. (కర్ణాటచ్ఛందోంబుధి). కందపద్యము ద్వితీయ చతుర్థ పాదాంతగణములకుబదులుగా నొక్కొక్కగురువును, చతుర్థపాద మందొకనగణమునకు బదులుగా నొక్క లఘువును బెట్టినచో నది యార్య యగును. ఆర్యప్రథమతృతీయపాదములకుఁ బన్నెండేసిమాత్రలును, ద్వితీయ పాదమునకుఁ బదునెనిమిది మాత్రలును, చతుర్థపాదమునకుఁ బదియేను మాత్రలునుండును.

1 ఆర్యాప్రథమార్ధమును బోలియే ద్వితీయార్ధముకూడనుండిన నది గీతి యనియు,ఆర్యాద్వితీయార్ధమును బోలి ప్రథమార్ధము కూడనుండిన నది యుప గీతియనియు,ఆర్యాప్రథమార్ధమును బోలి ద్వితీయార్ధమును,ద్వితీయార్ధమునుబోలి ప్రథమార్ధము నుండినచో నది యుద్గీతి యనియునర్థము. ఈలక్షణములువృత్త రత్నాకరమునందలి లక్షణముల ననుసరించి యున్నవి. వృత్తరత్నాకరమం దార్యాగీతి యను నింకొకగీతి చెప్పఁబడినది. దానిలక్షణము:—ఆర్యాపూర్వార్ధం యది గురుణైకేనాధికేన నిధనే యుక్తమ్, ఇతరత్తద్వన్నిఖిలం దలం యదీయముదితేయమార్యాగీతిః. ఇది కందపద్యలక్షణమునకు సరి పోవును. ఛందోఽంబుధిలో గీతిమాత్రము చెప్పఁబడియున్నది. 2. వ-త త్క్రియఁ బశ్చార్ధమునందుఁ జెప్పఁగా నీ. వీనితో సాంస్కృతికజాతులు సమాప్తము.

### తెనుఁగు జాతులు. [1]

క. [2]వెలయంగఁ దెనుఁగుబాసకుఁ
దల మయ్యెడు సీసములును దర్వోజలు గీ
తులు నక్కరలును ద్విపదలు
పొను పొందఁగ రేచఁ డిష్టమున నొనరించున్[3]. 10

### సీసములు.

క. * ధాత్రిక గవిత్వతత్త్వము
పాత్రతఁ గడునొప్ప వెలయుఁ (బ్రాజ్ఞులచేతన్)
మాత్రోక్తి నష్టగణముల
మాత్రలు సీసముల కెల్ల మల్లియరేచా! [4] 11

క. [5]నలనగసలభరతలలో
పలనాఱునుమీఁద రెండు పద్మాప్తగణం

---

1 ఈశీర్షిక మూలములో లేదు. 2 చూ. అర్ణవ జాతానసె సం, పూర్ణతెయిం సకలవిషయ భాషాదిగళం, నిర్ణయమాగఱుపిదెనాం, కర్ణాటక భాషియందమం కేళ్ పేళ్వెం. (కర్ణాటకచ్ఛందోంబుధి.) 3 చ-లో దర్వోజలు నం, దుల షట్పదములు నక్కరములు ద్విపదలు రేచఁ డిష్టముగ నొనరించున్. ప - 4 - వపాదము. బలురగడలు మంజరియును బలుమదుఁ గృతులన్. 4 క - ప - లలో మాత్ర వసు దశవ నవష, జాన్మత్రలు సీసముల కెల్ల మల్లియరేచా. మఱియొకపాఠము. మాత్రోక్తి దశమ నవష, జాన్మత్రలు మాత్రలకు నెల్ల మల్లియరేచా. 5 చ - నలనగసల భరతగణం, బులు గూడఁగ వానిపాదములు నొక్కెడలన్, గలయ నహం బులు రెండున్, గలయున్ సీసము బెడంగుగా నిడవలయున్.

* సీసమునం దష్టవిధము లగుమాత్రాగణము లుండు నని యీపద్యము నుత్తరార్థము భావము.

బులుగా నాలుగు పదములఁ
జెలు వగు నొకగీతితోడ సీసం బమరున్.

క. నలనగసలభరతగణం
బులు నొడఁబడి వాని పాదముల నొక్కటి నై
కలయ[1] నహంబులు నట్లన
కలయ నొడంబడి పెనంగుఁగాఁ దమలోనన్. 16

వ. సీసంబు లన్నవి విషమసీసంబులు, సమసీసంబులు నన
రెండు దెఱంగు లయ్యె. అందు,

విషమసీసం బెట్టి దనిన.

[2]ఊహ నేడు గణములుగను నొనర నగణ మొండెఁ ద
త్సాహచర్య మొండె గురుకసహితముగ నొనర్ప ను
త్సాహ మయ్యె నిదియునుం బ్రశస్తముగ నొనర్ప ను
ర్వీహితోరుచరిత యదియ విషమసీస మై చనున్.
బ్రాలు వళ్లు లీల నోలిని నిలిపి యా
గణము కాని యొండుగణము లిడక
యభినుతార్థరచన యభినుతమై యుండఁ
జెప్ప విషమసీస మొప్పుఁ గృతుల.

---

1 ద-గలుగు. 2 ప-లో, ఊహనాలు నినులగణము లొనరరగణ మొండఁద, త్సాహచర్య మాదిగురువుసహితముగ నొనర్పను, త్సాహమయ్యె నిది వినఁ బ్రశస్తముగ రచింపను. (నాలుగవపాదము సమానము). గీతము లేదు.

వ. మఱి సమసీసంబు లన్నవి అవకలిసీసంబు, ప్రాససీసంబు, అక్కిలిప్రాససీసంబు, వడిసీసంబు, అక్కిలివడిసీసంబు నా నేనుదెఱంగు లయ్యె[1]. అందు,—

→ అవకలిసీసము. ←

పాదంబు నాలుగు పాదముల్ గాఁ జేసి[2]
మొదలిమూఁటికి లోకవిదిత మైన
యలయూఱు[3]గణములు వెలయ (నిర్)మూఁ డిడి
మూఁనుగాఁ దక్కినవానియందు
నగణముల్ రెం డిడి తగఁ గూడఁ బాదముల్
నాలుగు నిప్పాట నోలి నిలిపి
సమసీసములు చెప్పఁ డమరంగ రెంటికిఁ
బ్రాసముల్ వేఱుగాఁ జేసి యొనర

గీ. సలలితముగ నిట్లు విలసత్పదంబుల
రసికమైనరచన లెసఁగి యుండఁ
గవిజనాశ్రయాంకుఁ డవకలిసీస మి
ప్పాటఁ జెప్పఁ బనిచెఁ[4] దేటపడఁగ[5]. 15

→ ప్రాససీసము; అక్కిలిప్రాససీసము. ←

ప్రాసంబు నాలుగు పాదంబులందును
బన్నుగా నిడి పెఱపాదములను

---

1 ద-లో ఆంకిలి సీస మొక్కటి యధికముగాఁ జేర్పఁబడినది. 2 ద-పాదంబులుగఁ జను. 3 చ-డ-ద- నలనాము. 4 ద-దొడఁగె. 5 చ-ప్పాటఁ జెప్పెఁ గృతులఁ దేటపడఁగ.

బ్రాసంబు లిడక తత్పాదంబు లం దెల్లఁ
బన్నుగా వళ్లట్లు [1]పరఁగ నిలిపి
దేసి తెనుంగులఁ[2] దియ్యనినొడువులఁ
దెల్లంబుగా నర్థదృష్టి దెలుపు
బ్రాసనీసము దీని పశ్చిమార్థంబునఁ
బ్రాసంబు వేఱొక్క ప్రాసమైన,
గీ. [3]శ్రీసమేతుఁ డైన జినపాద[4]పంకజా
వాసమధుకరుండు వాసవప్ర[5]
హాసభాసి[6] రేచఁ డనవద్యుఁ డక్కలి[7]
బ్రాసనీస మనుచుఁ[8] బరఁగఁ జెప్పె. 16

వడిసీసము ; అక్కలివడిసీసము.

వివిధచతుష్షష్టివిద్యల నజుఁ డని
వినుతనయోపాయ విమలబుద్ధి
నమరేంద్రగురుఁ డని యధిక తేజంబున
నాదిత్యుఁ డని సుందరాంగయుక్తి
నంగజుఁ డని యీగి నంగాధిరా జని
యలవున నభిమన్యుఁ డని సమస్త
జనులు ముదంబున శ్రావకాభరణాంకు
సత్కవిఁ గవిజనాశ్రయు గుణాఢ్యుఁ

1 చ-పదిలపఱచి. 2 క-చ-దేసితెనుంగున. 3 ఈగీతము ప-లో లేదు. 4 ద-శ్రీపాద. 5 క-వాసవసర. 6 చ-భాస. 7 ద-రేచఁ డనుపండితుం డిట్లు. 8 చ - సీసములను. ద- సీసమరసి.

గీ. బాగడుచుండుమ రని యి ట్లపూర్వరచన
నలరఁ జెప్పిన వడిసీస మయ్యె; దీని
పశ్చిమార్ధంబు వడి యొండు పాట నిలుప
నదియె యక్కిలి[1]వడిసీస మయ్యెఁ గృతుల.[2] 17

వృత్తంబునకు వలె వెలయు నాల్గడుగుల
నెసఁ బ్రాసములు నిల్పి విరతు లునుపఁ
బ్రాససీసం బగుఁ, బశ్చిమార్ధము నట్లు
భాసిల్ల నక్కిలిప్రాససీస
మమరు; మున్ గ్గైకొన్నయతి పాదమం దెల్ల
నడరిన వడిసీస మనఁగఁ బరఁగు,
నర్ధమర్ధమునకు యతులు వేఱైచనఁ
జెప్ప నక్కిలివడిసీస మయ్యె;
గీ. నవకలికి నిట్లు ప్రాసంబు లతిశయిల్లు,
యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడవ
నదియె సమసీస మలరును; మదను గీతి[3]
పరఁగ విషమసీసం బగు భానుతేజ![4] 18

---

1 ద-యంకిలి. 2 ద-లో నీపద్యము పిదప—సీసము రెండుగణంబులఁ, బ్రాసంబై మతియు నిధివిరామం బైనన్, భాసిల్లు దీనిమీఁదను, జేసినవిషయములచేత సీసము లయ్యెన్. అను పద్యమున్నది. 3 ద-నదియె సమసీస ముత్సాహమునను గీతి. 4 ప-యును విషమసీస మిఁక విను ముత్తమగుణ. ఈపద్యము పిదప, ప-లో "ఈక్రమానఁ బ్రాససీసము, అక్కిలిప్రాససీసము, వడిసీసము, అక్కిలివడిసీసము, అనకలిసీసము, సమసీసము అనఁగా నాఱు తెఱంగు లయ్యె" ననియుఁ, బిదప "ఊహనాఱునినుల గణము లొనర" ఇత్యాది పద్యమును గలవు.

### తరువోజ.

[1]నలనామగణము లినగణంబుతోడ
నాలుగుగాఁ జేసి నాటించి యిల్లు
కలయంగ నెనిమిది గణములై రెండు
గణములతుద యతిగా నిల్పి యపర
వెలయంగఁ బాదముల్ విరచింప వళ్లు
వేర్వేఱ నిప్పాట విదితమైయుండ
సలలితగతిఁ గృతి చనఁ జెప్పఁ డనియె
జానుగాఁ గవిజనాశ్రయుఁడు తరోవ్వజ. 19

### గీతులు.

వ. మఱి గీతు లన్నవి విషమగీతులు, సమగీతులు నన రెండు తెఱంగు లయ్యె. [2]అందు విషమగీతులు ఎత్తుగీతి, ప్రగీతి, మేలన[3]గీతి యనం బరఁగె. అందు.

### ఎత్తుగీతి.

[4]శ్రీదయితాధిపా న
మోదయ నలి నన్రత[5] 20

---

1 ద - లో "సీ. నలనామషట్క మినగణద్వయంబుతో నాలుగుగాఁ జేసి నాటి యిట్లు। కలయంగ నెనిమిదిగణము లయ్యెను రెండు గణములతుద యతిగాఁగ నమర। వెలయంగఁ బాదముల్ విరచించి వళ్లు వేర్వేఱ నిప్పాటను విదితముగను। సలలితగతిఁ గృతి చనఁ జెప్పఁ డనియెను జానుగాఁ గవిజనాశ్రయుఁడు దనర". ఇది సీసపద్యలక్షణముగాని తరోవ్వజలక్షణముగాదు.
2 "అందు విషమగీతులు వైతండికంబు లనం బరఁగె" నని కొన్ని ప్రతులలో నున్నది. 3 ద- మెలకగీతి. 4 లక్షణ మస్పష్టము. ఒక యింద్రగణము రెండు సూర్యగణములు చేరి యొకపాద మని లక్ష్యము తెలుపుచున్నది. ప్రాసమున్నది.

యెూదిత మైన నెత్తు
గీదియ యొప్పుఁ గృతుల.[1]

## —⁂ ప్రగీతి. ⁂—

[2]మూఁడు సేసినగణములు[3] రెండు నలములు
మూఁడినగణములును మొగి నహంబు
పోఁడి గాఁగ నర్ధమున కగుమీఁద ని
[4]ట్లుండఁ జెప్పవలయు నొగిఁ బ్రగీతి. 21

## —⁂ మేలనగీతి. ⁂—

[5]ఒనర నేడ య్యైన[6]గణము లొప్పఁ బెరసి యుండ
ఘనతరముగ వళ్లు నిట్లు గలసియుండ నిలిపి

యతిలేదు. సురనాథుమీఁద సూను లిరువురు రెంట విరతి, ధరణిఁ బ్రాసంబు దనరు నెత్తుగీతియందు.—అప్పకవీయము(వావిళ్లవారిప్రతి) ఇందు నాల్గవ పాదమున గణభంగ మున్నది. రెండవపాదమందు యతి లేదు. 6 క-డ. నలనవత్రే.

1 క-గీతి యయ్యెఁ గృతులందు. 2 తొలిపాదములో మూఁడు సూర్యగణములపై రెండు నలము లనియు, రెండవపాదమందు మూఁడు సూర్యగణములపై నగణహగణంబు లనియు, ద్వితీయార్ధమునకుఁ గూడ నిట్లే యనియుఁ దాత్పర్యము. కాని, లక్ష్యమునుబట్టి 1, 3 పాదములకు మూఁడుసూర్యగణములపై రెం డింద్రగణము లనియు, 2, 4 పాదముల కయిదు సూర్యగణము లనియుఁ జెప్పవలసి యున్నది. ఈలక్షణ మాటవెలఁదికిని జెల్లును, గాని యందుఁ బ్రాసము లేదు. దీనినే యప్పకవి పవనగీతి యని వాడెను. 3 సేసి+ఇనగణములు. 4 ప్రాసమువిచారణీయము. 5 క-డ-ల లో మాత్రమున్నది. క-లో 2, 3 పాదములు. ఘనతరంబుగాఁగ నిట్లు గలసి యుండ నిలిపి। వినుత మేలగీతి విస్తరంబు గాఁగ (రెండవపాదమం దొకగణము

విసుతమేలనమనుగీతి విస్తరంబుగాఁగ
జననుతుండు చెప్పె వరవిశాలకీర్తియుతుఁడు. 22

## 1ఆటవెలఁది ; తేటగీతి.

ఇనగణత్రయంబు నింద్రద్వయంబును
హంసపంచకంబు నాటవెలఁది;
సూర్యుఁ డొకనిమీఁద సురరాజు లిద్దఱు
దినకరద్వయంబు తేటగీతి. 23

## అక్కరలు.

క. 2వినుతద్విత్రిచతుర్గురు
జనితగణంబులు రవీంద్రచంద్రాఖ్యము లై
చను నక్కరజాతులకె
ల్లను, నాదిమ(లఘువు) మొదల లఘు విడవలయున్.

---

లోపించినది.) డ-1వ పాదము. ఒనర నయినగణము లొప్పఁ బెరసియుండ. (ఒకగణము లోపించినది). 6 ఏడు+అ=ఏడ. ఇనగణములు=ఇనసంబంధగణములు. హగణమైనఁ జాలు నగణమైనఁ జాలు హగణ। నగణములును రెండు గలసి నాటియంఘ్రికేడు। తగినవిరతి నాలుగింటఁ దనరఁ బ్రాసమొదవి। మిగుల మెఱయుచుండుఁ గృతులఁ గమలనాఖ్యగీతి. (అప్పకవీయము.) నాల్గవపాదమందు యతిభంగ మగుటచేఁ గవియభిప్రాయము "మేలనాఖ్యగీతి" యని యైనఁ గావచ్చును.

1 దీనికి ముందు ద-లో "అందు సమగీతులలక్షణంబు లెఱింగించెద" నని యున్నది. 2 రెండు గురువులతోఁ బ్రస్తరించినచో నాలుగు గణములును, మూఁడుగురువులతోఁ బ్రస్తరించినయెడల నెనిమిదిగణములును, నాలుగు గురువులతోఁ బ్రస్తరించినఁ బదియాఱుగణములును బుట్టును. వీనిలో మొద

వ. అవి మహాక్కర, మధ్యాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కర లనునేను తెఱంగు లయ్యె. అందు,

### 1మహాక్కరము.

2అమరఁ బ్రాపల్లు రెండునాఁ జెలఁగి నా
లగుచోట విరతి యాదిత్యుమీఁద
నమరపతి రెండు మూఁడు నాల్గైదు నా
ఱగుతావులను నిల్పి సొబగుమీఱ

---

టి రెండేసి గణములు విడిచి, తక్కినగణములలో నాదిని లఘు వున్నగణముల యాదిని మఱియొకలఘు విడిన రెండుసూర్యగణములు, నాఱింద్రగణములుఁ, బదునాలుగు చంద్రగణములు నైనవి. ఈగణములే యక్కరలయందు వచ్చును. విడిచిపెట్టిన యాఱుగణములు కలిపికొనినచోఁ గర్ణాటచ్ఛందోనుసారముగ నాలుగుబ్రహ్మగణములు, నెనిమిదివిష్ణుగణములుఁ, బదియాఱు రుద్రగణములు నగును. చూ:—ఎరడుం మూఱుం నాల్కుం, గురువిం ప్రస్తరిస అంబునిధి గజ ధరణీశ్వరగణ మొగెగుమవర్కుం, సరసిజభవ విష్ణు రుద్ర సంజ్ఞెగళక్కుం. కరపురవార్ధియాగె గురువాగిరె తద్గురువిందవోధసా, గిరె లఘుయుగ్మమాక్రమదె ముంతెసమం కడెవట్ట బిణ్పినోళ్, బరెలఘువొం దె; పింతెలఘు;ముంతెసమం; మొదలింతగుళ్దపం, కరుహద శేక్షణే! గణమ నింతిను సర్వలఘుత్వపుప్పినం. (కర్ణాటచ్ఛందోంబుధి).

1 దీనికి ముందుద-లోఁ జంపస్రూర్యేంద్రగణవివరణ మున్నది. ప-ప్రతి యింతటితో సరి. 2 ఈపద్యము ద-లో మాత్రమున్నది. ఈగణనియమము కన్నడములోని పిరి (పెద్ద) యక్కరగణనియమమునకుఁ జేరియున్నది. చూ. మొదలొళజగణం పుందదె బక్కత్తెమెద్దుగణంగళె విష్ణువక్కుం। తుదియొళెంబ తాణదొళెల్లియుం కందర్పరిపుగణం నెలసినిలక్కె। పదదొళెరడెంబసంఖ్యెయొళొఱలొళజగణం సమవాయమప్పెడక్కుం।సదమళేందునిభాననే!కర్త్రవినిష్టదినరిదు పిరియక్కరం.(కర్ణాటచ్ఛందోంబుధి).

సమరఁ జేయుచుఁ జంద్రు నే డగుచోట
నదికిన యేడుఁగణములలోనఁ
గ్రమము తప్పక యప్పాటఁ బెద్దయ
క్కర మొప్పఁ గవిజనాశ్రయుఁడు సెప్పె. 25

మధ్యాక్కరము.

[1]సురరాజు సురరాజుఁ గూడి
సూర్యుతో నొడఁబడి మఱియుఁ
గరమొప్ప నిప్పాట నాఱు
గణములు మధ్యాక్కరంబు
విరచింపఁ బంపెఁ బ్రానల్లు
వెలయఁ గవిజనాశ్రయుండు
సురుచిరముగను సుశబ్ద
శోభితం బగునట్లు గాఁగ. 26

మధురాక్కరము.

[2]రవి దివిజరాజ [3]గీర్వాణరాజ దేవాధిదేవ
కువలయప్రియు లిప్పాటఁ గూడ నేనుగణములు
నవిరళముగఁ[4] బ్రావడి మధురాక్కరంబు ధరలోనఁ
గవిజనాశ్రయుం డెఱిఁగించెఁ గవుల కింపుజనియింప.27

---

1 చ- డ-లలో నాల్గవపాదము లేదు. 2 క- చ- డ- ద-లలో నున్నది. 3 ద-రవియు దివిరాజు. 4 ద-నవిరతముగ. గణనియమమున మధ్యాక్కర కన్నడములో దొర (సమాన) యక్కరమునకును, మధురాక్కర నడుమ(మధ్య)ణక్కరమునకును జేరియున్నవి. వానిలక్షణములు. సర

### అంతరాక్కరము.

[1]ఇన సురేంద్ర చంద్రంబు లిప్పాట వచ్చి
పొసరి యుండంగఁ బ్రావళ్లు పూర్వభంగి
న నగణంబులు నాలుగింటం బెనంగ
ననుపమానాంతరాక్కర మయ్యె రేచ. 28

### అల్పాక్కరము.

[2]ఇంద్రుండు మఱియొక్కయింద్రుఁ గూడి
చంద్రుతోఁ నోడఁబడి చనిన సత్క[3]
వీంద్రు లల్పాక్కరం బిది యందురు[4]
చంద్రాస్య ! కవిజనాశ్రయకవీంద్రా![5] 29

---

సిజోదరగణ మెరడ జనుమల్లి నెలెదిక్కె మత్తం। సరసిజోదరగణమెరడ జను మక్కెగణముమాఱక్కుం। సరసిజలోచనె! దొరవెత్తగణదిం దొరవెత్త పెసరిం। దొరెయాగి సందుదు దొరెయక్కర మెనసిప్పుదీ తెఱదిం. జలజసంభవగణ మక్కె మొదలొళే నడువెమూఱుం। జలరుహోదరగణమక్కె కొనెయంతక గణమక్కుం। తిలకదంతిరె తలెయొళే బందిక్కె కామబాణా। వళియుపాంగెర్దె గణమక్కె నడువణక్కరకె సఖీ! (కర్ణాటకచ్ఛందోంబుధి).

1 ప్రథమపాదమందు యతి విచార్యము. ఇది కన్నడమం చెడె (అంతరము) యక్కరకుఁ జేరి యున్నది - వనజసంభవగణమక్కె మొదలొళ్ త్తల్। వనరుహోదరగణయుగళమదక్కె. రు। వనదఅంత్యదొళ్ బందిక్కె నాల్కెగణ। వినితె, వనితే! కేళ్ ఎడెయక్కరక్కెసుం. (క. ఛం) 2 చ- ఇంద్రుఁడు మఱియొక్కయింద్రుతోడఁ। జంద్రుతోఁ గూడఁగాఁ జనసత్క. 3 ద-చనిననుం గ. 4 ద - బిదియనిరి. 5 ఈలక్షణము కన్నడములో కిఱి (చిన్న) యక్కర లక్షణముం బోలియున్నది. పాడెయలరిర్బరుం మొదలొళిక్కె। జడెయ శంకరనొర్బం తుదియొళిక్కె। మడది! కేళ్ మూఱుగణమె సెదిక్కె।గడ, కిఱియక్కరక్కెనె లక్షణం. (క. ఛం)

### ద్విపద.

ఇంద్రగణములు మూఁడినగణం బొకటి
చంద్రాస్య! ద్విపదకుఁ జనుఁ జెప్ప రేచ![1] 30

### త్రిపద.

[2]త్రిదశేంద్రు లాఱగు పదియగు నెడనకున్
గదియ రెంటను మూఁటను
నదుకుడుఁ ద్రిపదకు నమరు. 31

### చౌపద.

నలగా భసలను నాల్గిటిలోన్[3]
వలసిన నాలుగు[4] వడిగాఁ బూన్
వెలయ గణద్వయవిశ్రమ మైనన్[5]
అలవడుఁ జౌపద కన్వితమైనన్.[6] 32

---

1 ద-కృతుల. 2 ఇది కన్నడలక్షణమును బోలియున్నది. బిసరుహోద్భవగణం రసదళస్థానదొళ్ । బిసరుహ నేత్రే! గణమె బర్కుళిదవు। బిసరుహ నేత్రే! త్రిపదిగే. (క. ఛం) 3 ద-నలగాభజసల నైదిటిలోన్. 4 త్రిగణము. అని పాఠాంతరము. 5 చ-డ-లలో వలసిన త్రిగణము వడిహగణాన్, వెలయ గుణధ్వనివిశ్రుత మైనన్. 6 ద-చౌపద కాఖ్య యొసంగున్. చౌపదతరువాత ద-ప్రతిలో రగడలు,మంజిరి,ఉదాహరణము, గీతము వీనికి లక్షణములు, లక్ష్యములు చెప్పఁబడినవి. ఇవి తెఱచుగా విష్ణుపరముగా నుండుటచేఁ బ్రక్షిప్తములుగాఁ నెంచఁదగియున్నవి. ఈపద్యములు షట్పదలక్షణము తరువాత క-ప్రతిలోఁగూడఁ గన్పట్టుచున్నవి. కన్నడచౌపది లక్షణము. మదనన తందెయముం । దొడవిద శంకరనొళ్ । పుదిదిరెసందుదునో । డిదు, సతి! చౌపదిగే. (క. ఛం)

## [1]షట్పదము.

[2]త్రిదశేంద్రగణములు వెలయ (నిర్; మూఁడిడి
కదియ నంత్యంబునఁ జంద్రుఁ గూర్చి
[3]తుది యిట్లుగా మదిఁ జె(ప్పిననదియ) ష
ట్పద మగు మల్లియ రేచ (నాఖ్య). 33

గద్యము. [4]ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహమధు
కరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైనకవి
జనాశ్రయం బనుఛందంబునందు జాత్యధికారము.

---

1 కొందఱు లాక్షణికులు షట్పదపాదమునకుఁ ద్విప్రాసము విధించిరి. యతి యెందును లేదు. 2 చ-డ-లలో మాత్ర మున్నది. కన్నడములో నాలువిధముల షట్పదములున్నవి. వాని సామాన్యలక్షణము. తో ఱువమాత్రె యషట్పది । గాతాఅడియెరడఱల్లి యొందే నియమం । మూఱక్కొందు తదర్ధం । బేటీశం కడెయొళెల్లమీ తెఱనక్కుం. 3 తుది యిట్లుగా పదిఁ జెప్పుటయును షట్పద యగు మల్లియరేచన వినవే. (అని మాతృక) 4 డ-లో మాత్ర మున్నది.

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము.

## షట్ప్రత్యయాధికారము.



క. శ్రీనారీప్రియకరుఁ డఖి
లానందకరుండు[1] కవిజనాశ్రయుఁడు ధరి
త్రీనుతుఁడు సమస్తకళా
నూనుఁడు షట్ప్రత్యయంబు లొగి నెఱిఁగించున్.[2] 1

క. క్రమమునఁ బ్రస్తారము న
ష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్య యనంగా
నమరు లగక్రియ యన న
ధ్వము నన షట్ప్రత్యయములు తనరున్ గృతులన్. 2

క. ఇడి గురువుక్రింద లఘు వ
క్కడ సదృశము సేసి పిఱుఁదఁ గదిసినగురువం
దిడఁ బ్రస్తారము; రెం డిడి
మడుప నగును వృత్తసంఖ్య మల్లియరేచా! 3

---

1 ద-శ్రీనారీప్రియుఁ డఖిలబుధానందకరుండు. 2 ద-లొప్పఁగఁ జెప్పున్. ద-ప్రతి యింతటితో సరి.

క. [1]ధరవృత్తసంఖ్యలో సవ
మురుముం జేసినను గూడు మొక్కడ లఘువుల్[2]
గురువులు సమవిషయంబులు
విరచింపఁగఁ జెడినయట్టివృత్తము వచ్చున్. 4

క. [3]ఒక్కటి మొద లిడి మడుపుచు
నక్కడఁ దుదదాఁక లఘువులందలిలెక్కల్
లెక్కించి కూడఁ బదపడి
యొక్కటి మఱి యందుఁ గూడ నుద్దిష్ట మగున్. 5

క. తరతరము దొంతివృత్తా
క్షరములు లెక్కాదికంబుగా నిల్పి యధో
క్షరము లుపర్యక్షరములు
పరువడిఁ గూడుచు నుపాంతపర్యంతముగాన్. 6

క. కలయ నుపాంతాధోక్షర
ము లుపాంతములందు నిల్పి మునుగూడిన నొ
క్క లగక్రియ (తత్పిండిత)
మలవడ సద్వృత్తసంఖ్య మల్లియరేచా ![4] 7

---

1 క-వృత్తసంఖ్యార్థమున్ బుధివిషమమైన । గురువు లిడుచును నొక్కటి గూర్చి మఱియు । దళముచేయుచు సమసంఖ్య దగఁగ లఘువు । దనర నిడినను నష్టవృత్తంబు వచ్చు. 2. ఈపాదము సమన్వయముగా లేదు. 3 డ-లో నున్నది. క-ఆది రెండిడిమడుపుచు నలర గురువు। లున్న నొక్కటి దరపుచు నన్ని యక్క-, రముల నీరీతిమడుపంగఁ గ్రమముతోడఁ, దెలిసి సుకవులు దీని నుద్దిష్ట మండ్రు. 4 క-లో "నొక్కలగక్రియ" యనునంతవఱకు మాత్రమే యున్నది.

క. అగు నర్థ మేకరహిత
ద్విగుణితసంఖ్యాంగులీకృతివ్యాపక మి
ద్ధగుణాఢ్య! కవిజనాశ్రయ!
జగజ్జనాధార! ధీర! చారుచరిత్రా! 8

[1]గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహమధుకరా
యమాన శ్రావకాభరణాంకవిరచితం బైనకవిజనాశ్రయం
బనుఛందంబునందు షట్ప్రత్యయాధికారము.

---

1 మూలములో లేదు.

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము.

## [1] దోషాధికారము.



క. శ్రీశ్రితవత్సుఁడు విద్యా
శ్రీశ్రితముఖుఁ డఖిలజనవిశేషితకీర్తి
శ్రీశ్రితభువనుఁడు సుకవిజ
నాశ్రయుఁ డెఱిఁగించుఁ గృతుల నగుదోషంబుల్. 1

క. [2]రూపితపునరుక్తి వ్య
ర్థాపార్థ విసంధి సంశయ చ్ఛందోభం
గాపక్రమ యతిభంగ వి
రూపోక్త్యపశబ్దములు విరోధము కృతులన్. 2

---

1. క-చ-డ-లలో నున్నది. ఈయధికారము ఛందశ్శాస్త్రమునకు సంబంధించినది కాక పోయినను, ప్రక్షిప్త మనుటకుఁ దగిన యితరకారణములు కనఁబడకుంటచే నీగ్రంథములోని భాగముగా గ్రహింపఁబడినది.

2 చూ. 1. యతిభంగ మర్థశూన్యం । సహతవిరుద్ధార్థ ముక్త పునరుక్తార్థం । చ్యుతయథాసంఖ్యం వ్యన। హితమచ్ఛందం విసంధికం నేయార్థం. 2. ఆగమ సమయన్యాయవి। భాగకళాకాల లోకదేశవిరుద్ధం। భోగివిషం బోల్లాపణ। త్యాగమనాగిసుగు మమళకృతివధు గినితుం. (కర్ణాటకవిరాజమార్గము.)

క. అని యిట్లు దశవిధము లగు
మునిమతమునఁ గావ్యదోషములు; వాని నెఱుఁ
గనివాఁ డెప్పాట నెఱుం
గు నుదాత్తకృతిప్రసంగగుణదోషములన్. 3

క. మునుసెప్పినశబ్దమె చె
ప్పునేని కొఱఁత లేక శబ్దపునరుక్తి యగున్;
మును చెప్పినయర్థమె చె
ప్పునేని కొఱఁత లేక యర్థపునరుక్తి యగున్. 4

క. దినకరుఁ డనిః మఱి దినకరుఁ
డనఁగా శబ్దపునరుక్తి యనఁ జనుఁ గృతులన్;
దినకరుఁ డని యాదిత్యుం
డనఁగా నర్థపునరుక్తి యనిరి కవీంద్రుల్. 5

క. [1]అయనయసమేత! కిమనీ
యయశా! పునరుక్తి యయ్యు సమరుఁ బదావృ
త్తియు మఱి వీప్సాభీక్ష్ణ
క్రియాసమభిహార మైనక్రియలఁ గృతులన్. 6

క. విను వసతి వసతి దప్పక
వన మనఁగా వీప్స, వచ్చి వచ్చి చనుం డా

---

(1) చూ:-దూరాభీక్ష్ణవీప్సా। ధారానుకృతిక్రియాసమభిహారసమీ। ఘోరతరచాపళాదిగె। సారం బునరిం పదక్కె యుగళోచ్చరణం.(కర్ణాటకశబ్దమణిదర్పణము)

ననఁగను నభీక్ష్ణ, మి మ్మి
మ్మనఁగాఁ గృతులన్ గ్రియాసమభిహార మగున్. 7

క. తనసత్యము తనశౌచము
తనశౌర్యము తనవిశేషదానము చతురా
ననునకుఁ బొగడఁగ మిక్కిలి
యని యీక్రియఁ జెప్పినది పదావృత్తి యగున్. 8

క. మొదలిక్రియతో సమర్పక
విదితవిరుద్ధార్థయుక్తి విపరీతం బై
తుదఁ గ్రియరాఁ జెప్పిన వ్య
ర్థదోష మని రఖిలకావ్యతత్త్వవిధిజ్ఞుల్. 9

క. [1]పొడిచి యొకునంగఁ బగఱను
గడుఁ గరుణాపరుఁడ వీవు కావున నీ క
గ్గెనువారు లేరు పగ ఱె
క్కుడ నని యిప్పాటఁ జెప్పఁగా వ్యర్థ మగున్. 10

క. దినకరుఁడును హిమకరుఁడును
మనసిజుఁడును బోల్ప నీసమానులు సత్కాం
తి నుదాత్తతేజమున సొబ
గున ననిన నపక్రమం బగుఁ గ్రమ మై. 11

---

(1) చూ: అరిన్నపబలమంగెల్దర్ । పరాక్రమక్రమదె శౌర్యమంప్ర
కటిసునీం। నరమహితా నినగే నహి । లెను మొళే సరత పరహితాచా
రపరా. (కవిరాజమార్గము.)

క. వినుతచ్ఛందంబునఁ జె
ప్పినయెడ నిలుపక కడలను దప్పి నిలుచుచో
ప్పునఁ జెప్పిన నది యతిభం
గనామదోష మగుఁ గృతి జగజ్జనవినుతా! 12

క. వెలయంగ లక్ష్యలక్షణ
ముల సిద్ధము లైనశబ్దములు గాని కుసం
ధులు మొదలైనవిరూపో
క్తు లెల్ల నపశబ్దనామదోషము లయ్యెన్. 13

క. పరఁగ నికారోపరిత
[1]త్స్వరమ యికారంబుతోడ సదృశముగా నె
వ్వరియి ల్లిది యి ట్లన కె
వ్వరి ది ల్లి ట్లనఁ గుసంధివర్గం బయ్యెన్. 14

క. స్వరగణము కూడి కృతిఁ ద
త్స్వర మైననకార మొంది వ్రాయై[2]చనఁగా
[3]దొర వీవు నజుఁడు ననకయ
దొర వీవు న్నజుఁడు ననిన దుస్సంధి యగున్. 15

క. తనకడకు వలచి యేఁ బో
[4]యిన నొల్లం డొల్లఁ డింక నే నాతనిఁ గా

---

1 క-త్పరమయికారంబుతో ధ్రువం బపరఁగ నె. 2 క - వ్రాలై. 3 క-దొర యీవునుజుం డనకయు, దొర యీవునుజుండు అనిన దుస్సంధి యగున్. 4. క - యిననోల్గొనఁ డొల్లఁ డింక.

మిని! గవయ నేమి నోఁచితి
నన విరహిణి కమరు నీక్రియన్[1] వ్యర్థంబై. 16

క. వన మిదియె కంటె తోడ్పడు
మన వన మని యొండు రెండు మడుఁగులు గాఁ జె
ప్ప నపార్థదోష మగు; నది
చను మత్తోన్మత్తబాలచరితములందున్.[2] 17

క. తలరమి నీతో మేరువు
అలవి యగుం గాక యొరులు అలవి యె వర ఉ
జ్జ్వలతేజ యనఁగ సంధిం
గలయనినొడువులు విసంధికము లనఁ బరఁగున్. 18

క. ప్రియమున నే నిన్ను మనః
ప్రియుపాలికిఁ బుచ్చఁ బోయి బింబాధర! పా
డియె యిట్లు చేయ నని సం
శయార్థముగఁ జెప్పఁ గృతుల సంశయ మయ్యెన్. 19

క. భూభాగనభోభాగది
శాభాగప్రవర్తికీర్తి సత్కృతికృతిచ్ఛం
దోభంగ మిట్లుగా ఛం
దోభంగం బనుప్రధానదోషం బయ్యెన్. 20

---

1. క—నీక్రియలు. 2. మా.స్థిర పుర్ధశూన్య మెంబుసు, దురుక్త మిడ నింతు పేర్దొడెల్లంపినం, మురుపుంపుని రాపరనెళ, శరీరముం పేళ్గు మఱివనా వం పేళ్గుం. (కవిరాజమార్గము.)

క. [1]నొాడువులకు సంధి నెగ్గులు
[2]వొాడమిన శ్రుతి దుష్ట మయ్యె; భూతలమున ని
చ్చెడునెడ నినుమడి సిరి యనఁ,
[3]బడు నీజో డనినఁ జుట్టుప్రా వగుఁ గృతులన్[4]. 21

క. తుద వేఱు సేసి మఱి చ
క్కఁదనపుఁదెనుఁగున సమర్చి కల వంబుజముల్
పదియు ననక కల వంబుజ
పది యని కృతిఁ జెప్ప వైరిపద మనఁ బరఁగున్.[5] 22

క. [6]వెలయఁగఁ [7](జెఱాకు) విలు గొని
[8]యలరమ్ములు చేతఁ బట్టి యంగజుఁడు విరా
హుల నేయు నేర్పుకడిమిన్
దొాల మెలయఁగ ననినఁ గాకుదోషం బయ్యెన్. 23

---

1 చ-నుడువు లగు సంధి నెగ్గులు. 2 డ-పొాడమిన నతిదుష్ట మయ్యె. 3 చ-బడునిచ్చోటులను. 4. ఈపద్యముతరువాత చ-లో, ఇందు కుదాహరణము. అననిపుండు పుట్టె నమరకుజము భంగి, బుధులః సుతులు నముల బుద్ధిఁ దలఁప, నిచ్చు నష్టసుతుల నితనికి శ్రీవాసు, దేవుఁ డనినఁ జుట్టుప్రావకృతుల. అని యున్నది. 5. చ-వైరివర్గం బరయన్. వైరిపదమునకుఁ గన్నడమందరిసమాసమని పేరు. "పదవిధికన్నడకంస, క్కదక్కమిల్లాద్యరించె సంభవన ఱిది, రుప్పదుబిరుదావళియొా శ్పే, ళ్వుసు పెఱవఱొా శాగదిదు విరుద్ధసమాసం." (శబ్దమణిదర్పణము );6 డ-వెలసినచెఱాకువిలుగొని,యలవడఁ ద్రిప్పుచునువచ్చెనంగజుఁడునువిరహుల నేయు ననినఁ గలిమిన్, దొాల మొలయఁగ ననినఁ గాకుదోషములయ్యెన్. 7. మూలములో జిగురాకని యున్నది గాని యది పొరపాటు. 8. క-యలమరు ద్రిప్పుచును వచ్చి యంగజుఁడు విరా,హుల నేయు నవఁలికలమని, దొాఁ మిగులఁగ ననినఁ గాకుదోషం బయ్యెన్.

క. ఈతఁడు "నృపస్య నగరం
యాతి" యనం జనిన సుప్తిఙంతంబులు, "కృ
త్వా తీర్త్వా జిత్వా" యన
బ్రాంతిగ నీక్రియలు చొరవు [1]భాషాకృతులన్. 24

క. వితతసుకవివాక్యం బవ
గతమై 'కవయో వదంతి కావ్యం' బని స
త్కృతి నీక్రియఁ బెట్టించిన
నతిశయమై యుండు సుప్తిఙంతం బయ్యున్. 25

క. ఇవి మొదలగునోడువు లనే
కవిధగ్రామ్యోక్తు లెన్ని కల వన్నియు స
త్కావు లపశబ్దము లని త
త్కవితల మెచ్చరు కవీంద్రకల్పమహీజా!. 26

క. శ్రీదేవీపతి రేచఁడు
గాదిలియై చనఁగ దేశకాలకళాలో
కాదివిరోధస్థితుల స
మాదరమునఁ దెలియఁ జెప్పె నఖిలజనులకున్. 27

క. కలహంసలు క్రొమ్మామిడి
తలిరులలోఁ గోకిలాళి తామరవిరిపు
వ్వులలో నాడెడు ననుచు
క్తులు దేశవిరోధనామదోషము లయ్యెన్. 28

---

1. ఇచ్చట భాష యనఁగా సంస్కృతముకంటె భిన్న మయినదేశ భాష. ఈశబ్ద మీయర్థమం దుత్తరదేశమందు వ్యవహరింపఁబడుచున్నది.

క. [1]చినికెడుఁ బురినెమిళులు ముద
మునఁ నాడెడు నింద్రగోపములు పాఱెడు నా
మనికాల మయ్యె నిలలో[2]
ననఁ గాలవిరోధదోష మనిరి కవీంద్రుల్. 29

క. అసమగజము లందలములు[3]
కొసమాత్రకుఁ దెచ్చు నట్టిగుఱ్ఱంబుల నం
కుస మిడక యెక్కు ననఁగా
హాసనీయకళావిరోధ మనిరి కవీంద్రుల్. 30

క. విను కరహీనుఁడు తగ వ్రా
సినపొత్తము తెచ్చి యొక్క చెవిటి విననఁగ బో
రనఁ జదివె మూఁగ సభలో
నన లోకవిరోధదోష మనిరి కవీంద్రుల్. 31

క. [4]ఘనదండకాష్ఠకృష్ణా
జినములు సొగయింప నొక్కజినముని చనుదెం
చె ననఁగ సమయవిరోధం
బని కవులకుఁ జెప్పెఁ గవిజనాశ్రయుఁ డొనరన్. 32

---

1 చ-చినికెనుభుని. 2 డ-మనికాలమయ్యెఁ బొమ్మిట్లన. 3 చ-అసమగజంబుల దవ్వుల. డ-అసమగజంబులు పూవులు. 4 చ-లో లేదు. చూ-అమరఁగఁ బులితోలును మ, స్తమునం బలుజడలు దాల్చి సొగసుఁ దొప్పెన్, హిమకరశేఖరుఁడి నన, సమయవిరుద్ధార్థమగుచుఁ జను సత్కృతులన్. (కావ్యాలంకారచూడామణి).

క. [1]జినసుతధర్మమహింసయ
యనుమతమున వితతముగ గజాసురుఁ బాపం
బని చంపఁ డయ్యె నీశ్వరుఁ
డన నిది యాగమవిరోధ మనిరి కవీంద్రుల్. ౩౩

క. అని యిట్టివి దశదోషము
లనఁ జనుఁ గృతి నివియ వెండి యతిశయతరమై[2]
చనుఁ గొన్నియెడల ధీరుల
మన మలరఁగఁ జెప్పిరేని మల్లియరేచా! ౩4

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియరేచన సుకవిజనా
శ్రయుఁ డీఛందంబుఁ జెప్పె జనులకుఁ [3]దెలియన్. ౩౫

[4]గద్యము. ఇదివాదీంద్రచూడామణిచరణసరసీరుహమధుకరాయమాన కవిజనాశ్రయశ్రావకాభరణాంక[5]విరచితం బైన కవిజనాశ్రయచ్ఛందంబునందు దోషాధికారము.[6]

---

1 చ-లో లేదు. 2 చ-అనునీదశవిధదోషము, లనఁ గృతులం దివియ వెండి యతిశయకరగమై. 3 క-నొనరన్. 4 డ-లో లేదు. దీనికిఁబూర్వము చ-లో నీక్రిందిపద్య మున్నది. సకలమహీజనంబులకు సంతసమయ్యెడు సౌఖ్యసంపదల్, సకలధరాధినాథులు నిజస్థితి దప్పకభూమి నేలఁగా, సకలకవీశ్వరుల్ పొగడఁ జంద్రుఁడు సూర్యుఁడు గల్గునంతకున్, సకలధరిత్రిలో వెలసి ఛందము తద్ద వెలుంగుచుండెడున్. 5 చ-శ్రావకాభరణ. 6 సమస్తాధికార మని పాఠాంతరము.

# *ప్రక్షిప్తపద్యములు.

పఙ్క్తి-ఛ్ఛందంబునందు :—

మనోరమావృత్తము.

నరజగంబులన్ మనోరమన్
బరఁగు పద్యతిం బఠింప నౌ. 1

మణిరంగవృత్తము.

సప్రసాదరసాగము లొందున్
దీప్రబాణయతిన్ మణిరంగన్. 2

పంచకమలావృత్తము.

పంచకమలాఖ్యన్ భయసల్గం
బంచితముగా పద్యతిఁ జెందున్. 3

త్రిష్టుప్ఛందంబునందు :—

ఉపజాతివృత్తము.

ఈ రెండువజ్రంబులు నిండుఁ గూడన్
సరోజనేత్రా ! యుపజాతి యయ్యెన్. 4

మందారదామవృత్తము.

ఆఱింట విశ్రాంతి యై తాతగాస్వా
ధారంబు మందారదామంబు రుద్రా ! 5

---

* 25 వపద్యము క-లోనున్నది. 14 వ పద్యము ద-లో నున్నది. తక్కినవన్నియు బ-లో నున్నవి.

సుముఖవృత్తము.

నజజవమున్ శరవిశ్రమముం
సుజననుతా! సుముఖం బెసఁగుం. 6

జగతీఛందంబునందు :—

పుటవృత్తము.

నగయుతయతితో నాతయుతం బై
యగణము తగ ఫాలాక్ష! పుటం బౌ. 7

చంద్రవర్త్మవృత్తము.

చంద్రవర్త్మ మగు సామజయతితోఁ
జంద్రజూట! రనభంబు సగణమున్. 8

కుసుమవిచిత్రవృత్తము.

కుసుమవిచిత్రం గొను నయయుగ్మం
బసదృశషడ్యత్యభిహిత మైనం. 9

ఉజ్జ్వలవృత్తము.

స్మయరుచి తలషడ్యతి నుజ్జ్వలా
హ్వాయము ననభరావళిఁ జెందినం. 10

అతిజగతీఛందమునందు :—

ప్రీతివృత్తము.

సగణత్రయముం జగసంయుతంబుగా
నెగడు న్నిధివిశ్రమనీతిఁ బ్రీతికిం. 11

సుమంగలీవృత్తము.

సజసంబుతో సగము సంగతితో సా
మజవిశ్రమంబున సుమంగలి యయ్యెన్. 12

క్షమావృత్తము.

ననతతగములన్ నవ్యభూభృద్యతిన్
వినుతమయి క్షమావృత్త మొప్పు న్మహిన్. 13

శక్వరీఛందమునందు :—

జలంధరవృత్తము.

వ్రాలిభకారయునున్ భభజనంబులతో
లాలితకీర్తి! దిశాయతి జలంధర యౌ. 14

లోలావృత్తము.

భూతేశా! మసమంబుల్ పొందంగా భగగంబుల్
స్వాతంత్ర్యక్షితిభృ ద్విశ్రామం బొందును లోలన్. 15

కమలవిలసితవృత్తము.

కమలవిలసితము కలయతితోడన్
క్రమమున నననగగములు గూడన్. 16

అతిశక్వరీఛందమునందు :—

మాలినీవృత్తము.

ననమయయయుతంబు న్నాగవిశ్రాంతమై యి
ట్లనుపమ మగుమాలిన్యాహ్వయం బయ్యె ధాత్రిన్. 17

మణిగణనికరవృత్తము.

మనులఘుగురుకము మణిగణనికరం
బన౯ జను నెనిమిది యగునెడ యతిగా౯. 18

[1]శాంతివృత్తము.

ఒంమగా రజద్వయంబు లొప్పు రేఫతో జనా
నందకారి శాంతి యయ్యె నాగవిశ్రమంబుతో. 19

సుకేసరవృత్తము.

హరినిభమూర్తి! సత్కవిజనాశ్రయా! సుకే
సర మగు దిగ్యతి న్నజభజంబు రేఫతో. 20

మనోజ్ఞవృత్తము.

నజజభరప్రకరంబున న్నిధివిశ్రమం
బజితమనోజ్ఞ మగు౯ నయం బొనగూడఁగా౯. 21

మాలతీవృత్తము.

కరటివిరతి నాగకాంత యాయుక్తితోడ౯
మరిగి తిరిగి చెప్ప మాలతీవృత్త మయ్యె౯. 22

ప్రభద్రకవృత్తము.

రజనిచరాన్వవాయహర! రామ! రాఘవా!
నజభజరల్ ప్రభద్రకము నవ్యదిగ్యతి౯. 23

చంద్రరేఖావృత్తము.

సారంబై చంద్రరేఖ౯ జంచన్మరేఫల్ మయూసం
చారంబుం జెంది పొందు౯ సప్తోదయద్విశ్రమం బై. 24

---

1 అప్పకవీయములో దీనికే సుగంధి యని పేరున్నది.

హంసయానావృత్తము.

ఆనతారిరేచ! హంసయానకొప్పుఁ గుంజర
స్థానవిశ్రమంబుగా రజద్వయంబు రేఫతో. 25

ఆకృతిచ్ఛందమందు :—

విచికిలస్తబకవృత్తము.

శబరవికృతిధర! పురహర! సవితృవిరతి విచికిల
స్తబకమున నిరువదిలఘువులు చన లగ మొగిఁ బెనఁగుఁ.[1]

వికృతిచ్ఛందంబునందు :—

పద్మనాభవృత్తము.

ఎన్నంగ నీతం డనాద్యంతుఁ డంచుం బ
రీక్షింతు రెవ్వాని వాఁ డెల్లనాఁడుఁ
నన్నేలు నా నర్కవిశ్రామమై పద్మ
నాభం బగుఁ సప్తతంబుల్ గగంబుఁ. 27

మత్తాక్రీడితవృత్తము.

మత్తాక్రీడితం బగు వృత్తం బొఁ ద్రిదశయతి
మయమననననవముల్.[2] 28

---

1 ద్వితీయపాదమందు యతి చెడినది. 2 యతి చెడినది. మత్తాక్రీడాఖ్యం బెంపారు న్మమతననననవ మహితమగుచు ర, త్నాత్మబ్రహ్మక్రాంతు ల్గ్రిందై. (అప్పకవీయము).

# కవిజనాశ్రయము.

## గ్రంథానుక్రమణిక.



# గ్రంథానుక్రమణిక.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 13 | జడ్డక్కరములు | జడ్డక్కరముల |
| ,, | ,, | మూఁడుఁగూడికొనగణములగున్ | మూఁడుగూడికొనగణ మయ్యెన్. |
| 9 | (అడుగున) | 4-ద-కళ్య | ఇది 10 పుట యడుగుననుండ వలయును. |
| 10 | 31 | మను,ష్యగణంబులు | మనుష్యగణంబులు |
| 12 | 40 | వాఁడగుఁగృతిపతి | వాఁడగుఁగృతిపతి, |
| 16 | 54 | యగణంబున్, | యగణంబున్ |
| ,, | ,, | పొలుప | పొలుచు |
| ,, | 55 | దానిరువదేను | దామిరువదేను |
| 18 | (అడుగున) | ధరబవనబీజములు | ధరఁబవనబీజములు |
| 19 | 62 | బరఁగఁగ | పరఁగఁగ |
| ,, | (అడుగున) | వర్గయ | వర్గయతి |
| 20 | 65 | జఘణనముల్ | జఘణనమల్ |
| 22 | 71 | వరకృతులకు | వరకృతులను |
| 25 | (వచనము) | తిప్రాసం | త్రిప్రాసం |
|  | 84 | దానమనోహర | [2]దానమనోహర |
| 29 | (వచనము) | అకృతి | ఆకృతి |
| 31 | ... | ... | (రెండవవచనము మొదట) వ, యనియుండవలయును, |
| 32 | (వచనము) | పాదంబులుగా | పాదంబుగా |
| 35 | 34 | రనరంబులన్ | రనరంబులన్ |
| 44 | (వచనము) | అత్యష్టి | అత్యష్టి |
| 45 | 90 | పృథ్వీవృత్తము | 1. పృథ్వీవృత్తము |
| 47 | (అడుగున) | ద్రిజగదభష్టదా | ద్రిజగదభీష్టదా |
| ,, |  | ఉత్పలామాలా | ఉత్పలమాలా |

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 48 | 112 | లతిత | లలిత |
| 52 | 124 | విశేషగుణ | విశిష్టగుణ |
| 54 | 133 | విలసత్పాదంబులు | విలసత్పాదంబుల |
| ,, | ,, | నిడియసాపాదములఁ | నిడసపాదములఁ |
| ,, | ,, | పద్ధతినొప్పున్ | పద్ధతియొప్పున్ |
| | (అడుగున) | రోచనా. కచ, | రోచనా. క-చ- |
| 55 | (వచనము) | స్వస్థానార్థవృత్తములలో | స్వస్థానార్ధసమవృత్తములలో |
| 56 | (అడుగున) | వృత్తమునకు జేరినవి | వృత్తమునకుఁ జేరినవి |
| 57 | | రథోద్ధత | రథోద్ధతి |
| ,, | 137 | (ఈపద్యముపిరువాత) | 'పరస్థానార్ధసమవృత్తములలో' అనిశీర్షిక యుండవలయు'' |
| 60 | 5 | ర్థములన్ | ర్ధములన్ |
| 61 | (అడుగున) | ప్రథమేర్థే | ప్రథమేర్ధే |
| 62 | 9 | జతిద్గీతయశా | జగద్గీతయశా |
| ,, | (అడుగున) | ద్వితీయార్థ | ద్వితీయార్ధ |
| ,, | ,, | ర్వార్థం | ర్వార్ధం |
| 63 | (అడుగున) | సుత్తరార్థము | సుత్తరార్ధము |
| ,, | ,, | మూలములోలేదు | మాతృకలోలేదు |
| 66 | 16 | నర్థదృష్టి | నర్ధదృష్టి |
| 69 | 21 | 2 2 మూఁడు | 2మూఁడు |
| 71 | (అడుగున) | జందస్రూ | జంద్రసూ |
| 74 | (అడుగున) | మంజిరి | మంజరి |
| 78 | 8 | అగునర్థ | అగునర్ధ |
| 81 | 8 | విశేషదానము | విశిష్టదానము |